## సదాశివ సమారంభాం



గురు దక్షిణామూర్తి



గురు వేదవ్యాస మహర్షి



గురు శుక మహర్షి



గురు నారద మహర్షి



గురు వాల్మీకి మహర్షి



గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం



గురు దత్తాత్రేయ



గురు బాబాజి



గురు గౌతమ బుద్ధ



గురు ఆదిశంకరాచార్య



గురు రామానుజాచార్యులు



గురు జ్ఞానేశ్వర్



గురు రవిదాస్



గురు కబీర్ దాస్



గురు చైతన్య మహా ప్రభువు



గురు నానక్



గురు రాఘవేంద్ర స్వామి



గురు వీరబ్రహ్మేంద్ర స్వామి



యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం



గురు త్రైలింగ స్వామి



గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస



అమ్మ శారదా దేవి



గురు వివేకానంద



గురు సాయిబాబా



గురు అరబిందో



గురు రమణ మహర్షి



గురు యోగానంద



గురు భక్తివేదాంత ప్రభుపాద



గురు మళయాళ స్వామి



గురు విద్యాప్రకాశానందగిరి



గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..





భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals
Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre

Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions |
Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| • Rashtrapati Bhavan<br>• CMU-Books<br>• Sanskrit<br>• TTD,Tirupathi<br>• Kerala Sahitya Akademi | • INSA | • Times of India<br>• Indian Express<br>• The Hindu<br>• Deccan Herald<br>• Eenadu<br>• Vaartha | • Tamil Heritage Foundation<br>• AnnaUniversity NEW! |

Title Beginning with.

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

Subject

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

Language

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, ఐవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# "ఒక్క క్షణం"

సమస్త సృష్టికి శ్రీసూర్యనారాయణుడు పంచకల్యాణి అశ్వములు పూనిన రధముపై సంచరిస్తూ, తన ప్రభాత కిరణాల వెలుగుతో మేలుకొలుపు పొందుతాడు

భాస్కరుడు, ఆదిత్యుడు, కశ్యపుడు, భానుడు, ఆదిత్యుడు, రవి అనే పర్యాయనామాలతో ఆకంతిమూర్తిని ప్రస్తుతిస్తారు

జన్మకుండలిలో రవి మహర్ధశ రవి అంతర్దశ అను కాలము లుంటుందని ఈ దశల ప్రభావం మానవుల జీవితం మీద అమితమైన ప్రభావం చూపిస్తుందని జ్యోతిష్య శాస్త్రము ఉద్ఘాటిస్తున్నది దీనివలన సూర్యభగవానుడు వెలుగుల దేవుడేకాక మానవులజీవితంలో ఉచ్ఛ నీచ స్థితులను నిర్దేశించే విధాత అని తేట తెల్లమవుతున్నది

"తేజ స్కామో విభావసుమ్" అంటే తేజస్సును పొందగోరువారు సూర్యుని ఆరాధించాలని భాగవతమందు చెప్పబడినది

"ఆరోగ్యం భాస్కరదాచ్ఛేత్" నిత్యం ప్రాతఃకాలమునందు సూర్యుని దర్శించి నమస్కారప్రణామాలు చేయుట వలన ఆరోగ్యం చేకూరును (మత్స్యపురాణం)

"దినేశం సుఖార్ధం" సకల సుఖములను ఆదిత్యుని ఆరాధన అందించును (స్కాంధపురాణం)

శ్రీ మద్వాల్మీకి "రామాయణ మందు" శ్రీరాముడు రావణుడిని వధించు టకు అగస్త్యమహాముని ఆదిత్యహృదయమును ఉపదేశించినాడని చెప్పబడింది అలాగే "శ్రీమద్భాగవంతమందు" సూర్యభగవానుని ఆరాధించుట వలనే సత్రాజిత్తునకు శమంతకమణి ద్వారా శ్రీకృష్ణపరమాత్ముని దర్శనభాగ్యం కలిగిందని చెప్పబడినది ఇంకా మహాభారతమందు అరణ్యవాసమునందు దరిద్రడైన ధర్మరాజు ఆదిత్యహృదయమును ఉపాసించి సూర్యభగవానుని కృపచే అక్షయ పాత్రను పొందబడినాడని చెప్పబడింది.

వేదములందు సైతము సూర్యభగవానుని ప్రశస్థము ప్రస్తుతింపబడినది ఋగ్వేదమంద అనేక రుక్కులు సూర్యుని కీర్తించాయి అధర్వణ వేదములో సూర్యధానమువలన రోగములు ఉపశమించు మంత్రములు ఉవాచింపబడ్డాయి.

అమరకవి సాంబుడు లాంటివారు సూర్యుని స్తుతించి తమ శారీరక బాధల నుండి విముక్తి పొందిన వృత్తాంతములు అనేకం మనకు రుజువులుగా నిలుస్తాయి

సూర్యభగవానుని ఆరాధించటం వలన శుభఫలితాలను పొందవచ్చునని పురాణములు, వేదములు కొన్ని వృత్తాంతముల వలన తేటతెల్లమవుతున్నది

మన భారత దేశంలో సూర్యభగవానునికి ఇరవై అయిదు దేవాలయములు ఉన్నాయి ఇందులో మూడు దేవాలయములు (అరసవిల్లి, అలంపురం, హనుమకొండ) మనరాష్ట్రంలో ఉన్నాయి

భారతదేశంలోనేకాక పాకిస్తాన్‌లో జీలంనది ఒడ్డున ముల్తాన్" సూర్యదేవాలయము ఈజిప్ట్‌లో కర్తక సూర్యాలయం, అబుసింబల్ సూర్య దేవాలయం నయీ సెరీల్లో అబూగురాబ్ లోని సూర్యదేవాలయాలుకూడా ప్రసిద్ధమైనవి వీటితో పాటుగా దక్షిణ అమెరికాలో "మాయన్" కాలంనాటి సూర్య దేవాలయాలు ఉన్నాయి

**"ఆదిత్య ! త్వమేవ ప్రత్యక్షం**
**బ్రహ్మాసి ! త్వమేవ ప్రత్యక్షం**
**విష్ణురసి ! త్వమేవ ప్రత్యక్షం**
**రుద్రొసి ఆదిత్యాద్వాయుర్జాయతే**
**ఆదిత్యా ద్భూమిర్జాయతే**
**ఆదిత్యా దాపో జాయతే**
**ఆదిత్యా జ్జ్యోతిర్జాయతే**
**ఆదిత్యాద్వ్యో మో జాయతే"**

పైశ్లోకం "అధర్వణీయ వేదము" నందు సూర్యోపనిషత్తు నందు ప్రవచింప బడినది బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులను ఆరాధించటం వలన కలుగు ఫలితము లన్నియు శ్రీసూర్యనారాయణుని ఆరాధనమువలన కలుగుతాయని వేదముల్లో చెప్పబడినది

**"ఉదయం బ్రహ్మ స్వరూపో మధ్యాహ్నేతు మహేశ్వరః**
**సాయంకాలే సదా విష్ణుఃత్రిమూర్తి శ్చ దివాకరః"**

ఈశ్లోకమునందు సూర్యభగవానుడు ఉదయం బ్రహ్మవలెను, సాయంత్రం విష్ణువు వలెను, మధ్యాన్నం మహేశ్వరుడు వలెను త్రిమూర్తుల అంశతో ప్రకాశిస్తాడని చెప్పబడింది. కనుకనే శ్రీసూర్యనారాయణుని ఆరాధన వలన త్రిమూర్తులను ఆరాధించి పొందు ఫలములను పొందవచ్చునని శాస్త్రఉవాచ

"ఏష చైవాగ్ని హోత్రం"
అగ్ని ముఖా వై దేవాః"

సూర్య నారాయణుడే అగ్ని అని "ఆదిత్య హృదయం" ఉవాచిస్తోంది అగ్ని ద్వారానే దేవతలందరూ ఉపాసించబడతారని శాస్త్రం జవాబిస్తోంది కనుక అగ్నియైన సూర్య భగవానుడిని ఉపాసించినా ఆరాధించినా సమస్తదేవతలను ఆరాధించినట్లే

**ధ్యేయస్సదా సవితృమండల మధ్యవర్తీ**
**నారాయణః సరసిజాసన సన్నివిష్టః ।**
**కేయూరవాన్ మకర కుండలవాన్ కిరీటి**
**హారీహిరణ్మయవపుః ధృత శంఖచక్రః ॥**

అని సూర్య మండలవర్తియైన 'హిరణ్మయ పురుషుని నారాయణ స్వరూపంగా ఉపాసించారు

శ్రీదేవి భాగవతంలో ఈ సమస్త సృష్టి అయినటువంటి బ్రహ్మాండమునకు మధ్యన ఉండేవాడు సూర్య భగవానుడు

పినతల్లి మాయోపాయము చేతమృత అండమునుండి జన్మించాడు కనుక "మార్తాండు" అని హిరణ్యాండము నుండి జన్మించాడు కనుక "హిరణ్యాగర్భుడంటా రని వాద ప్రతివాదములున్నా శ్రీదేవి భాగవతం ఆధారంగా మృతఅండమునుండి జన్మించినాడని నిరూపితమౌతోంది.

ఈ సమస్త సృష్టికి శ్రీసూర్యనారాయణుడు తనవెలుగురేఖలతో దృష్టిని ప్రసాదిస్తున్న అపద్బాంధవుడు. అతడేవెలుగు అతడే చూపు.

**నమో శ్రీ సూర్యనారాయణ నమో నమః**

## "శ్రీ సూర్య నారాయణ అవతార వృత్తాంతం"

కశ్యప మహామునికి ఇరువులు భార్యలు పెద్దభార్యపేరు "అదితి" రెండవ భార్య పేరు "దితి" అదితి గర్భంనుండి దేవతలు, దితి గర్భం నుండి దైత్యులు జన్మించారు.

ఈ సోదరుల నడుమ రానురాను మనస్పర్ధలు చోటుచేసుకున్నాయి అధికారం కోసం దైత్యులు రాక్షసమూక సహాయం కోరి వారితో కలిసి దేవతలమీద యుద్ధం ప్రకటించారు దేవతలు ఈ సంకటస్థితిని తప్పించమంటూ కశ్యప మహామునిని వేడుకున్నారు అప్పుడు కశ్యపముని వారిని చింతింపవద్దని చెప్పి,

ఆదితితో కలిసి సూర్యశక్తిని ఉపాసించారు సూర్యుడు ప్రత్యక్షమై వరం కోరుకోనమనగా దేవతలకు ఎదురయిన సంకట స్థితిని వెల్లడించి "ప్రభూ . నీవే రక్షించాలి" అని వేడుకున్నాడు

అందుకు సూర్య శక్తి సంతసించి దైత్యులు మదమును అణచగలిగే శక్తిని నా తేజస్సుతో అదితి గర్భ మందున ప్రతిష్టింపచేస్తాను అని వరమిచ్చాడు ఆవిదముగా సూర్యశక్తి అధితి గర్భమునందు ప్రవేశించి ఆమె గర్భవతి అయినది

ఆగర్భస్థ శిశువు కొరకు అదితి పూజలు పునస్కారములు ఒనరించుచూ ఉపోషములు చేస్తున్నది కాలం గడిచి ప్రసవసమయం దగ్గరపడుచున్నది ఒక నాడు కశ్యపమహాముని అదితితో ముచ్చటిస్తూ "సతీ నీవు ఈ పూజా పునస్కారముతో ఉపోషములు ఆచరిస్తున్నావు గర్భస్థ శిశువునకు ఆహారము చేకూరవద్దా .? అంటూ మృదువుగా మందలించాడు

అందులకు అదితి "స్వామి! ఈ గర్భాండము సాక్షాత్తు ఆసూర్య నారాయణుని తేజస్సుతో ఊపిరిపోసుకున్నది సకలప్రాణులను శక్తి ధాతువు అయిన ఆతేజస్సుకు అహారమెందుకు? పానీయమెందుకు? ఇది దేవతలను దైత్యుల నుండి రక్షించుటకు జన్మిస్తున్న సూర్య అవతారము కనుక చింతింపవలదు అన్నది.

సతీ పతు లిరువురూ వాదించుకోగా

"స్వామీ. ! మనిద్దరికి వాదోపవాదములు ఎందుకు? మీకు తెలుసు ఆసూర్య నారాయణుడి శక్తి . తేజస్సు. అయినా మరొక్కమారు పరీక్షిద్దాం" అంటూ అదితి తన గర్భాండమును పరిత్యాగం చేసింది.

ఆ గర్భాండ పిండము వెలువరించిన తేజస్సుకు సమస్తలోకములందును నిప్పులు చెలరేగాయి కశ్యపముని అదితి వేదమంత్రములతో ఆ తేజస్సును ప్రస్థుతించారు. ఆ తేజస్సు నుండి ఒక బాలుడు ఉద్భవించాడు ఆ బాలుడే కాశ్యపుడు అన్ననామధేయంతో దేవతలపక్షమున ఆధిపత్యం వహించి దైత్యులను రాక్షసులను ఓడించి దేవతలకు విజయం చేకూర్చాడు

**సూర్య భగవానునికి ముగ్గురు భార్యలు**

**పద్మిని... ఉష... ఛాయ**

"ఉష" మొదటి భార్య ఈమె కాల స్వరూపిణి. ఉష సూర్యునికి అర్ధాంగి అగుటచే సృష్టికి మూలములైన మంత్రపుష్పములందు ఏడవదగు కాలపుష్పం వికసించి పగలు రాత్రి ఏర్పడెను వీరిరువురికి కలిగిన సంతానమే "ప్రభాతుడు" ఇతడే ప్రభాతకాలానికి అధిపతి

రెండవభార్య విశ్వకర్మపుత్రిక అగు "పద్మినీదేవి" వీరికి కలిగిన ముగ్గురు పుత్రులలో ప్రధముడు "వైవస్వతుడు" ఇతను పదునాల్గు మంది మనువులలో

ఒకడు ఈ "వైవస్వతుడు" అధిపతిగా ఉన్న వైవస్వతమన్వంతరంలోని కలియుగం లోనే ప్రస్తుతం మనం జీవిస్తున్నాం

పద్మినీదేవి భర్త తేజస్సును చూడలేక కనులు మూసుకున్నపుడు సమవర్తియగు యముడు చంచల దృష్టితో చూచినపుడు విలోలమైన యమున కల్గినది (యమునానది)

మూడవ భార్య ఛాయ ఛాయాదేవి ఈమె పద్మినీదేవి సూర్యుని తేజస్సును భరించలేక తన ఆత్మశక్తితో తన శరీరమునుండి ఒక స్త్రీరూపమును సృషించినది అందుకే ఈమెను ఛాయాదేవి అను నామంతో వ్యవహరిస్తారు

పద్మినీదేవి శరీరంనుండి ఉద్భవించిన ఛాయదేవి పద్మినీదేవిని తన కర్తవ్యం ఉపదేశింపమనగా "నీవు నా అంశ అయిన ఉత్తమురాలివి కనుక నాభర్తను నీభర్తగా స్వీకరించు నాపుత్రులను. పుత్రికను కూడా స్వీకరించు అంటూ కర్తవ్యం ఉపదేశించింది ఆనాటినుంచి ఛాయాదేవి సూర్యభగవానుని భర్తగా స్వీకరించింది

ఛాయాదేవికి సూర్యునికి నలుగురు పుత్రులు ఒకపుత్రిక కలిగారు ప్రధమ పుత్రుడు సూర్యుని వర్ణమును తేజస్సును పుణికిపుచ్చుకొనుట వలన అతను "సావర్ణి అని సూర్యుని పుత్రుడు కనుక "సూర్యసావర్ణి" గా ప్రసిద్ధి పొందాడు

శ్రుతకర్మ, శ్రుతశ్రవణుడు, శని మిగిలిన ముగ్గురుపుత్రులు తపతి (నది) వారికి కలిగిన పుత్రిక.

వెలుగుటాడు ప్రతి చోటా ఛాయాదేవిటాడదను సమస్త ప్రకృతి యందు కల ఛాయారూపము ఈ దేవియే శ్రుతకర్మ అన్నికర్మలకు అధిపతి. శ్రుతశ్రవణుడు ఈ బ్రహ్మాండమందలి సమస్త శబ్దములకు అధిపతి. శని తనను ఆరాధించు వారికి సమస్త సుఖశాంతులను, ధిక్కరించువారికి సమస్త ఇక్కట్లను కలిగిస్తున్నాడు. సావర్ణి సూర్యవర్ణములు కలవాడు కనుక అతనివలన సృష్టియందుమూలమైన సప్తవర్ణములు తెలియజేయబడుతున్నాయి తపతి నదియై జీవజాలమునకు దాహార్తిని దీర్చుచున్నది.

శ్లో॥ **ఓం–మిత్ర–రవి–సూర్య–భాను–ఖగ–పూష–హిరణ్యగర్భ**
**మరీచ్యాదిత్య–**
**సవితృ– అర్క– భాస్కరేభ్యోనమః ॥**
**సంజ్ఞా ఛాయోషా సమేత శ్రీ సూర్యనారాయణ పరబ్రహ్మణే నమః ॥**

ఈ మంత్రమును పూజించుటవలన సూర్యగ్రహము వలన కలుగు నాలుగు దోషములు నివారింపబడి శాంతి సౌఖ్యములు అదిత్యుని కటాక్షము

వలన పొందవచ్చును

రవి (సూర్యుడు) నీచస్థానమందు సంచరిస్తున్నపుడు ఈ యంత్రమును పూజించుట వలన ఆ నక్షత్రకుడు నీచస్థితినుండి బయటపడి ఉచ్ఛస్థానమును చేరవచ్చును

శుభ ముహూర్తంలో రాగిరేకు మీద లిఖించబడిన ఈ యంత్రమునకు జపములు చేసిన పిదపమాత్రమే గృహమునందుంచుకొనవలెను ధూపదీప నైవేద్యములు నిత్యము చేయవలెను

# రథ సప్తమి

**"మాఘ మాసే సితేపక్ష సప్తమ న్యాద్ర దన్యతు**
**తత్ర స్నానంచ దానంచ తత్పర్యం చాక్షయం భవేత్"**

మాఘమాసం ఫిబ్రవరి, శుక్లపక్షంలో వచ్చే రథసప్తమినాడు సూర్య భగవానుడు భూమికి దగ్గరగా రావటం జరుగుతుంది. ఈ సమయంలో సూర్యభగవానుడి శక్తి భూమిమీద పుష్కలంగా ప్రసరిస్తూఉంటుంది

**"సూర్య గ్రహణ తుల్యాతు శుక్లా మాఘస్వసప్తమే.**

ఈ సప్తమ శుభదినంగా సూర్యగ్రహణంగా పరిగణిస్తూ ఆ రోజు దీక్షలు, వ్రతాలు, నోములు చేబడతారు ఇది విశేష ఫలం ఇస్తుందని నమ్మకం ఈ సప్తమినే "రథసప్తమీ" అంటారు

అయపు వేళసప్తమి తిధిఉండి సాయంత్రంకల్లా "అష్టమి" వస్తే అద్భుతమైన అపురూపమైన రహస్యమైన మంత్రములను జపం చేయుట మంత్ర తంత్ర యంత్ర పిద్యల ఉపాసనను చేయుట వలన విశేషమైనటువంటి ఫలితాలను పొందవచ్చునని పూర్వీకులునుండి బలమైన నమ్మకం కలదు

రథసప్తమి నాడు సూర్యభగవానుడు నక్షత్రరధము నెక్కి ఆకాశమంతా తిరుగుతాడు, అందుకే రథసప్తమినాడు ఆకాశములో నక్షత్రములు రధాకారములో కనిపిస్తాయని ఇతిహాసంలో ఉన్నది

రథసప్తమినాడు తలమీద జిల్లేడు, రేగు ఆకులను ఉంచుకుని తలనిండాస్నానం చేస్తారు ఇలా స్నానంచేయుట వల్ల విశేషమైన ఫలితాలను పొందవచ్చుని ధర్మశాస్త్రం ప్రవచిస్తోంది

తలస్నానం చేయునపుడు సూర్యుని యొక్క పన్నెండు నామములను స్మరిస్తూ తల, మెడ, కాళ్ళు, చేతులు, భుజాలు, కళ్ళు, హృదయం, నాభి, పాదాలపై ఆకులను ఉంచుకుని స్నానం చేస్తారు ఇలా చెయ్యడం వల్ల ఈ అంగములపై సూర్యుని శుభదృష్టి ప్రసరించి రోగములు నాశనమవుతాయని నమ్మకం

"సప్త సప్త మహా సప్త సప్త ద్వీపా వసుంధర
సప్తార్క వర్ణమాదాయ సప్తమీ రథ సప్తమి"

ఈ శ్లోకం స్నాన మాచరించునప్పుడు పఠించాలి

సమస్తే రుద్ర రూపాయ రసానాం పతయే నమః
వరుణాయ నమస్తేస్తు హరివాస నమోస్తుతే॥
యద్యజ్జన్మ కృతం పాపం మయా జన్మసు సప్తమ
తన్మేరోగం చ శోకంచ మాకరీ హంతు సప్తమీ ॥
ఏతజ్జన్మ కృతం పాపం యజ్జన్మాంతారార్జితం
మనోవాక్కాయజం యచ్చ జ్ఞాతాజ్ఞతేచయే పునః ॥
ఇతి సప్త విధం పాపం స్నానాన్మే సప్త సప్తికే
సప్తవ్యాధి సమాయుక్తం హరమాకరి సప్తమీ ॥

ఆర్ఘ్యం - "ఓననా సర్వలోకాం సప్తమీ సప్త సప్తిగా
సప్త వ్యాహృతికే దేవీ నమస్తే సూర్యమండలే"

సప్తమిాదేవతని సూర్యమండలాన్ని నమస్కరించి జిల్లేడు. రేగు, చందనం, అక్షింతలు కలిపిన నీటిని లేక క్షీరమును రాగి పాత్రతో ఆర్ఘ్యమివ్వడం శుభం

## "పూజావిధానం"

ఎర్ర చందనంతో పద్మాన్నిగీసి ఎర్రని పువ్వులతో ఆదిత్యుని పన్నెండు నామాలతో పూజించాలి

నామాలు - 1 మిత్రాయ నమః 2) రవేనమః 3) సూర్యా నమః 4) భానవే నమః 5) ఖగాయ నమః 6) పూషాయ నమః 7) హిరణ్యగర్భాయ నమః 8) మరీచయే నమః 9) ఆదిత్యాయ నమః 10 సవిత్రేయనమః 11 ఆర్కాయ నమః 12) భాస్కరాయ నమః

సూర్యదర్శనం జిల్లేడు అకుకు రంధ్రం చేసి దాని మధ్య నుండి చేసుకొనుట శుభం సూర్యగాయత్రిని 108 సార్లు జపించి, సూర్యుని శాంతి రత్నములను పూజించుట సాంప్రదాయం

**పూజనివేదన**

ఆవు పేడతో చేసిన శ్రేష్ఠమైన పిడకలమీద క్షీరాన్నమును వండి చిక్కుడు ఆకులు మీదనుంచి నైవేద్యం పెట్టవలెను సృష్టికి వెలుగును, శక్తిని ప్రసాదించు అదిత్యుని ఆరాధించుట వలన శుభము శ్రేష్టము కనుక ఈవిధమైన పూజా విధానములను రథ సప్తమినాడు ఆచరించుట వలన సూర్యభగవానుని అనుగ్రహమును పొందవచ్చును

# "రవిగ్రహ ప్రభావం"

జోతిష్యం శాస్త్రంలో సూర్యుడిని రవిగా వ్యవహరిస్తారు

అంతర్దశ మహర్దశలను లెక్కకట్టి ఈ గ్రహప్రభావం ఆనక్షత్రికుడి జీవితంమీద ఏలాంటి ప్రభావం చూపిస్తుందో నిర్ణయిస్తారు

జ్యోతిష్యశాస్త్ర ప్రకారము రవిగ్రహమును ప్రభావితము చేయు అంశములను ఓసారి పరిశీలిద్దాం

రవిగ్రహం ఆధిపత్యం వహించే నక్షత్రాలు ఉత్తర, ఉత్తరాషాఢ, కృత్తిక

మిత్ర గ్రహాలు చంద్రుడు, కుజుడు, గురుడు

శత్రుగ్రహాలు శని, శుక్రుడు

స్వక్షేత్రరాశి సింహరాశి

ఉచ్ఛక్షేత్రరాశి మేషము

నీచక్షేత్రరాశి తుల

శాంతిరత్నము మాణిక్యం (కెంపు)

మహర్దశకావలం ఆరుసంవత్సరములు

ఆధిపత్యపుదిక్కు తూర్పు

(సంఖ్యశాస్త్రం) ఆధిపత్యఅంకె ఒకటి

వర్ణం ఎరుపు

దానములు గోధుమలు

దోష నివారణ మార్గం - ఆరువేల సార్లు మూలమంత్రపు జపము చేసి ఎరుపురంగు వస్త్రములో శక్తి కొలది గోధుములను మూట కట్టి దానమును ఇవ్వవలెను.

మూలమంత్రం

**"ఓం హ్రీం ఘృణిః సూర్యః ఆదిత్యః శ్రీయ్"**

ఈ మూల మంత్రమును ప్రతి ఉదయము పదకొండు సార్లు చొప్పున నూట ఎనిమిదిరోజులపాటు జపం చేసినచో దేహమునందలి తేజము, మనసునందలి స్థిరత్వము, కార్యమునందలి విజయము, గృహమునందు శాంతి సౌఖ్యము పొందవచ్చును

ఈ మూలమంత్రమునందు ఒక్కొక్క బీజాక్షరమునకు విశిష్టమైన శక్తి ఉన్నది

ఓం - సృష్టియందు మొదటి శబ్దం ఇది జ్ఞానమును, మోక్షమును ప్రసాదించును

హ కారము - ఇది శాంతిని సౌఖ్యమును ఐశ్వర్యమును, ప్రసాదించును

రేఫ కారములు - ఈ అక్షరములు అగ్ని యొక్క బీజాక్షరములు

ఈకారము - శత్రువులను మృత్యువును జయించే శక్తి నిచ్చును

ఘుకారము - భయము నిస్సత్తువను తొలగించి రోగాన్ని నశింపచేయును

ఋకోం - నక్షత్రముపై యుండు సర్పగ్రహము చెడుఫలితములను హరించి స్థిరత్వమును ప్రసాదించునది

ణకోం - వంశాభివృద్ధిని అందించును మృత్యువును హరించును

ఇకోము - శాంతి సౌఖ్యములను అందించును

సకోము - సాహిత్య, సంగీత రంగములందు విజయము ప్రసాదించును

ఉకోములు - వ్యాధి నివారణం అశాంతి నివారణం

రేఫ - అగ్ని యొక్క బీజాక్షరము

యకోము - శాంతిని ప్రసాదించును

అకోము - విజయము ప్రసాదించును

నధకోము.- సర్వకోరికలయందు విజయము

ఇకిరము - సంతానాభివృద్ధి వంశ ప్రతిష్ట పెంపొందును

తకోము - గుప్త ధన లభ్యం

యకోము - శాంతి, విజయము

**శ్రీమ్ :- శ్రీలక్ష్మీ దేవి యొక్క బీజల కనుక సిరిలభ్యం**

జాతకంలో రవి గ్రహప్రభావంవల్ల కలుగు యోగములను పరిశీలిద్దాం.

రవిగ్రహప్రభావమువల్ల కలుగు యోగములు జ్యోతిష్యశాస్త్రం నాలుగుగా వర్తించింది అవి, బేశియొగము 2) బోసియోగము 3) ఉభయచర యోగము 4) భాస్కర యోగము ఒక్కొక్క యోగము ఒక్కొక్క ఫలితమును ఇస్తుంది ఈ యోగములకు సూర్యునితోపాటు చంద్రగ్రహప్రభావము కూడా ఉంటుంది కానీ చంద్రగ్రహము నీచఫలితములు కలుగ చేయుగ్రహముగా మూడు యోగముల నందుండి భాస్కరయోగమునందు మాత్రమే శుభగ్రహంగా సంచరిస్తాడు

బేశి యోగ ఫలం - ఆజాతకుడు సమదర్శి సత్యవాది సుఖియై జీవిస్తాడు ఈయోగం జాతకంలో రవిగ్రహ తరువాతి స్థానంలో చంద్రుడు తప్ప ఏవైనా శుభగ్రహం ఉన్నప్పుడు మాత్రమే ఈ యోగం సంభవించుట జరుగుతుంది

బోశియోగం - ఈ జాతకుడు సమర్థుడు, కీర్తివంతుడు, దాత అయ్యి ప్రకాశిస్తాడు జాతకంలో రవి నుండి ద్వాదశమున చంద్రుడు తప్ప మరేదైనా శుభగ్రహం ఉన్నచో ఈ యోగం కలుగుతుంది ఈ యోగమునకే "వాశియోగం" అను పర్యాయ నామము కూడా కలదు

ఉభయచరయోగం - ఈ జాతకుడిది రాచజీవితం, అధికారము, కీర్తి ధనధాన్యవస్తు లేమిలేకుండా, కీర్తిశిఖరములు అధిరోహించు సుఖజీవియై ఉంటాడు ఈ యోగం జాతకమునందు రవికి రెండువైపులా చంద్రుడు తప్ప మరేదైనా శుభగ్రహముఉన్నచో కలుగును

భాస్కరయోగం - ఈ యోగ జాతకుడు శూరుడై శాస్త్రములు ఎరిగినవాడై సంగీతము, ఇత్యాదికళలందు మక్కువ కల్గిన వాడై ధీరుడై జీవించును ఈ యోగము జాతక చక్రమునందు రవిగ్రహమునకు ద్వితీయమున బుధుడు బుధుడికి ఏకాదశమున చంద్రుడు చంద్రునికి ఏదైనా ఒకకోణమునందు బృహస్పతి కలిగియున్న "భాస్కరయోగము" సంభవించునని జ్యోతిష్య శాస్త్రము చెప్పుచున్నది

## "ఆదిత్యుని విశిష్టత"

సూర్యుడు సమస్త సృష్టికి వెలుగును ప్రసాదించేదైవం. ఆ ఆదిత్యుని స్థానము మన హృదయం "సౌరసూక్తం" సూర్యనమస్కారములు ద్వారా సకలరోగములు నివారింపబడతాయన్నది పురాణఉవాచ

రుగ్మతలతో పాటు దారిద్ర్యము తీర్చగలిగే శక్తిమంతుడు శ్రీ సూర్యనాయకుడు. దారిద్ర్యమునకు ములకారకుడైన శనిమహాదేవుడు ఈ సూర్యనారాయణుని సుపుత్రుడు కనుక, సూర్యారాధన దారిద్ర్యమును నిర్మూలింపగలదు

పురాణ ఇతిహాసములందు శ్రీ సూర్యనారాయణుని మహిమకు ఎన్నో తార్కాణములు కనిపిస్తాయి

1) విశ్వామిత్ర మహర్షిచే సృష్టింపబడినటువంటి గాయత్రి మంత్రము సూర్యనారాయణుడికే అర్పితం చేయబడింది

2)అరణ్యావాస మందు ధర్మరాజు సూర్యోపాసన చేసి అక్షయపాత్ర పొందాడు

3) యజ్ఞవల్క్యునికి ఆంజనేయునికి వేదశాస్త్రములు నేర్పింది సూర్యుడే

4) శ్రీకృష్ణుని కుమారుడు సాంబుడిని కుష్టురోగమునుండి విముక్తి కల్గించింది సూర్యుడే

5) సత్రాజిత్తుకు శమంతకమణి సూర్యుడు ఇచ్చినదే

6) ప్రస్కణ్వుడనే మహర్షికి మూడు మంత్రాలను ఉపదేశించి వాటిని జపించుటచే అతన్ని చర్మరోగం నుండి విముక్తుడ్ని చేసింది శ్రీసూర్య నారాయణుడే

7) నందిధేనువు వలన వశిష్టునకు విశ్వామిత్రునకు కలహము వాటిల్లినపుడు విశ్వామిత్రుడు ప్రయోగించిన బ్రహ్మాస్త్రములన్నియు వశిష్టుని చేరకుండా అడ్డుకున్నది శ్రీసూర్యనారాయణుడి తేజస్సే

8) కర్ణునికి సహజ కవచకుండలాలు ప్రసాదించినది సూర్య భగవానుడే

9) విశ్వకర్మ సూర్యుని తేజస్సు తగ్గటానికి సానపట్టినపుడు వెలువడిన శేషతేజస్సుతో ఈశ్వరునికి త్రిశూలము. విష్ణువుకు సుదర్శన చక్రము యమునకు దండము, కుబేరునకు శిబికము. కార్తికేయునకు శక్తిపాశము తయారుచేసి ఇచ్చెను

10) సూర్యభగవానుడి ప్రభాతకిరణములు సంజ్ఞాకిరణములు గృహమునందు క్రమంతప్పకుండా నిత్యము ప్రసరించినచో ఆ ఇంట నున్న వాస్తు దోషములు తొలగిపోవును భూత ప్రేత పిశాచములు చేరవు

ఇలా చెప్పుకుంటూ పోతే పురాణములలో శ్రీసూర్యనారాయణుడి ప్రశస్థి అనేక విధములుగా ప్రవచింపబడుతూ ఉంటుంది త్రిమూర్తులు పురాణపురుషులు, అవతారమూర్తులు, అందరూ సూర్యభగవానుడిని ఆరాధించి కార్యములను సఫలం కావించుకున్నారు

నమో శ్రీసూర్యనారాయణాయనమో నమః

## "మాసాదిత్యులు"

సంవత్సరమునకు ఉండు పన్నెండు మాసములనందు సూర్యభగవానుడు పన్నెండు నామములతోను పన్నెండు గుణములతోను సంచరించుచు ఈసృష్టి యందున్న సమస్తజీవులకు ఉపకారకుడై సంచరించును

ఆ మాసములు, నామములు, గుణములు పరిశీలిద్దాం

| | | |
|---|---|---|
| 1 | చైత్రం | ధాతా |
| 2 | వైశాఖం | అర్యముడు |
| 3. | జ్యేష్ఠం | మిత్రుడు |
| 4 | ఆషాడం | వరుణుడు |
| 5 | శ్రావణం | ఇంద్రుడు |
| 6 | భాద్రపదం | వివస్వంతుడు |
| 7 | అశ్వయుజం | త్వష్ట |
| 8 | కార్తీకం | విష్ణువు |

9 మార్గశీర్షం తర్యముడు
10 పుష్యం భగుడు
11 మాఘం పూషుడు
12 ఫాల్గుణం క్రతువు

చైత్ర మాసమున ఈ "ధాతా" రూపమునందు సూర్య భగవానుడు ఎనిమిది వేల కిరణముల్లో రక్తవర్ణముతో ఉండును

విస్తువు నాభినుండి బ్రహ్మఉద్భవించునపుడు ఓంకార ధ్వని సమస్త బ్రహ్మాండమును ఆవరించినది అందు సర్వ జగత్తుకు ధాత అయిన సూర్యుడు విష్ణువై పాలించుతూ రుద్రుడై సంహరిస్తాడని పలకబడింది

వైశాఖ మాసమున "ఆర్యముడు" రూపమున పదివేలకిరణములతో ప్రకాశిస్తూ వాయురూపంలో పీతవర్ణం కలిగి సంచరిస్తాడు ఈ సమయమున ఆరాధించినచో పిత్త సంబంధ వ్యాధుల నుండి విముక్తి కలిగిస్తాడు

జేష్ఠమాసంలో "మిత్ర" అనేరూపముతో ప్రకాశిస్తూ ప్రాణులకు జీవ వాయువును అందిస్తాడు

ఆషాఢమాసంలో "వరుణుడు" రూపంతో ఈబ్రహ్మాండమును జలధార లతో ముంచెత్తి ప్రాణులకు దాహార్తి దీరుస్తాడు

శ్రావణ మాసమునందు "ఇంద్రుడు" రూపమున కార్యసాధన సఫల మగుటకు సహకరించి కీర్తి, అధికారములు ప్రసాదిస్తాడు

భాద్రపద మాసంలో "విషస్వంతుడు" రూపమున ప్రకృతియందు పచ్చదనమును నింపి లతా వృక్షములను పునర్జీవులు గావిస్తాడు

ఆశ్వీయుజ మాసమందు "త్వష్ట" రూపమున జీవులను కష్టములను, నష్టములు నివారిస్తూ ఉపకారకుడై ఉంటాడు.

కార్తీక మాసమునందు "విష్ణువు" యై తన తేజస్సును బ్రహ్మాండమంతా వ్యాపింపజేసి ఆహారమును సృష్టించి ప్రాణులకు ఉదరపోషణకు తోడ్పడుతాడు

మార్గశిరమందు "తర్యముడు" రూపమున ఫలములను "పక్వపరచును"

పుష్యమాసమందు భగుడు రూపమున ప్రకృతి చేతనాచేతనమును సమకూర్చును.

మాఘమాసమునందు "పూష" రూపమున చేతనాచేతనములను నియంత్రించుచు సకలప్రాణులకు దారి చూపును.

ఫాల్గుణ మాసమందు "క్రతువు" రూపమున తనతేజస్సును సమశక్తి యందు ఉంచి సకల జీవులకు శక్తిని, బలమును చేకూర్చును

ద్వాదశ మాసములందు ద్వాదశరూపములతో సంచరించు శ్రీసూర్య నారాయణునికి ఆయా మాసములందు ఆయారూపములను ఆరాధించి ధ్యానించుట వలన ఆయాఫలములు కలుగును

# ఆదిత్య హృదయం

శ్రీ గురు గణేశ శారదా శ్రీ సూర్యనారాయణ స్వామి దేవతాభ్యో నమః

ఓం అస్యశ్రీ ఆదిత్య హృదయ స్తోత్రస్య ' అగస్త్యఋషిః ' అనుష్టుప్ఛందః శ్రీ ఆదిత్యో దేవతా ' సర్వదేవాత్మక ఇతి బీజం ' తేజస్వీ ఇతి శక్తిః ' రశ్మిమాన్ ఇతి కీలకం ' మమ శ్రీ సూర్య ప్రసాద సిద్ధ్యర్థే శ్రీ ఆదిత్య హృదయ స్తోత్రపారే వినియోగః

కరన్యాసం

ఓం హ్రాం - అంగుష్ఠాభ్యాం నమః

ఓం హ్రీం - తర్జనీ భ్యాం నమః

ఓం హ్రూం - మధ్యమాభ్యాం నమః

ఓం హ్రైం - అనామికాభ్యాం నమః

ఓం హ్రౌం - కనిష్ఠికాభ్యాం నమః

ఓం హ్రః - కరతల కరపృష్ఠాభ్యాం నమః

అంగన్యాసము

ఓం హ్రాం - జ్ఞానాయ హృదయాయ నమః

ఓం హ్రీం - ఐశ్వర్యాయ శిరసేస్వాహా

ఓం హ్రూం - శక్త్యై శిఖాయైవౌషట్

ఓం హ్రైం - బలాయ కవచాయ హుం

ఓం హ్రౌం - తేజసే నేత్రాభ్యాం వషట్

ఓం హ్రః - వీర్యాయ అస్త్రాయ ఫట్ భూర్భు వస్సువరోమితి దిగ్బంధః

## ధ్యానం

**ఓం ధ్యేయస్సదా సవితృమండల మధ్యవర్తీ**
**నారాయణ స్సరసిజాసన సన్నివిష్టః**
**కేయూర వాన్మకరకుండల వాన్కిరీటీ ।**
**హారీ హిరణ్మయ వపుర్ధృత శంఖ చక్రః ॥**
**తతో యుద్ధ పరిశ్రాంతం సమరే చింతయా స్థితం**
**రావణం చాగ్రతో దృష్ట్వా యుద్ధాయ సముపస్థితం**

దైవతైశ్చ సమాగమ్య ద్రష్టు మభ్యాగతో రణం
ఉపగమ్యా బ్రవీ ద్రామమగస్త్యో భగవాన్ ఋషిః

అగస్త్య ఉవాచ॥

రామ రామ మహాబాహో శృణు గుహ్యం సనాతనం
యేన సర్వా నరీ న్వత్స సమరే విజయిష్యసి
ఆదిత్య హృదయం పుణ్యం సర్వ శత్రు వినాశనం
జయావహం జపేన్నిత్య మక్షయ్యం పరమం శుభం
సర్వమంగళ మాంగళ్యం సర్వపాప ప్రణాశనం
చింతాశోక ప్రశమన మాయుర్వర్ధన ముత్తమం
రశ్మిమంతం సుముద్యంతం దేవాసుర నమస్కృతం
పూజయస్వ వివస్వంతం భాస్కరం భువనేశ్వరం
సర్వ దేవాత్మకో హ్యేషః తేజస్వీ రశ్మిభావనః
ఏష దేవాసురగణాన్ లోకాన్ పాతి గభస్తిభిః
ఏష బ్రహ్మాచ విష్ణుశ్చ శివస్స్కందః ప్రజాపతిః
మహేంద్రో ధనదః కాలో యమ స్సోమో హ్యపాంపతిః
పితరో వసవ స్సాధ్యా హ్యశ్వినౌ మరుతో మనుః
వాయు ర్వహ్నిః ప్రజా ప్రాణా ఋతుకర్తా ప్రభాకరః
ఆదిత్య స్సవితా సూర్యఃఖగః పూషా గభస్తిమాన్
సువర్ణ సదృశో భాను ర్హిరణ్యరేతా దివాకరః
హరిదశ్వ స్సహస్రార్చి స్సప్త సప్తి ర్మరీచిమాన్
తిమిరో న్మథన శ్శంభు స్త్వష్టా మార్తాండ అంశుమాన్
హిరణ్యగర్భ శ్శిశిర సప్తనో భాస్కరో రవిః
అగ్నిగర్భో ఉదితేః పుత్ర శ్శంఖ శ్శిశర నాశనః
వ్యోమనాథ స్తమోభేదీ ఋగ్యజు స్సామపారగః
ఘనవృష్టి రపాం మిత్రో వింధ్యవీధీ ప్లవంగమః
ఆతపీ మండలీ మృత్యుః పింగళ స్సర్వతాపనః
కవిర్విశ్వో మహాతేజా రక్తస్సర్వ భవోద్భవః
నక్షత్ర గ్రహతారాణా మధిపో విశ్వభావనః
తేజసామపి తేజస్వీ ద్వాదశాత్మన్ నమో ఉస్తుతే
నమః పూర్వాయ గిరయే పశ్చిమే గిరయే నమః

జ్యోతిర్గణానాం పతయే దినాధిపతయే నమః
జయాయ జయభద్రాయ హర్యశ్వాయ నమో నమః
నమో నమ స్సహంస్రాంశో ఆదిత్యాయ నమో నమః
నమ ఉగ్రాయ వీరాయ సారంగాయ నమో నమః
నమః పద్మ ప్రబోధాయ మార్తాండాయ నమో నమః
బ్రహ్మేశానాచ్యుతేశాయ సూర్యాయా దిత్యవర్చసే
భాస్వతే సర్వభక్షాయ రౌద్రాయ వపుషే నమః
తమోఘ్నాయ హిమఘ్నాయ శత్రుఘ్నాయా మితాత్మనే
కృతఘ్నఘ్నాయ దేవాయ జ్యోతిషాం పతయే నమః
తప్త చామీకరాభాయ వహ్నయే విశ్వకర్మణే
నమస్తమోభి నిఘ్నాయ రుచయే లోక సాక్షిణే
నాశయత్యేష వైభూతం తదేవ సృజతి ప్రభూః
పాయత్యేష తపత్యేష వర్షత్యేష గభస్తిభిః
ఏష సుప్తేషు జాగర్తి భూతేషు పరినిష్ఠితః
ఏష చైవాగ్ని హోత్రంచ ఫలంచైవా గ్నిహోత్రిణాం
వేదాశ్చ క్రతవశ్చైవ క్రతూనాం ఫలమేవ చ
యాని కృత్యాని లోకేషు సర్వ ఏష రవిః ప్రభుః
ఏన మాపత్సు కృచ్ఛ్రేషు కాంతారేషు భయేషు చ
కీర్తయన్ పురుషః కశ్చిన్నావ సీదతి రాఘవ
పూజయస్వైన మేకాగ్రో దేవ దేవం జగత్పతిం
ఏత త్రి గుణితం జప్త్వా యుద్దేషు విజయిష్యసి
అస్మిన్ క్షణే మహాబాహో రావణం త్వం వధిష్యసి
ఏవముక్త్వా తధాగస్త్యో జగామ చ యధాగతం
ఏతచ్ఛ్రుత్వా మహా తేజా నష్టశోకోఽభవత్తదా
ధారయా మాస సుప్రీతో రాఘవః ప్రయతాత్మవాన్
ఆదిత్యం ప్రేక్ష్య జప్త్వాతు పరం హర్షమవాప్తవాన్
త్రిరాచమ్య శుచిర్భూత్వా ధనురాదాయ వీర్యవాన్
రావణం ప్రేక్ష్య హృష్టాత్మా యుద్ధాయ సముపాగమత్
సర్వ యత్నేన మహతా వధే తస్య ధృతోఽభవత్
అధ రవి రవదన్ని రీక్ష్య రామం ముదిత మనాః పరమం ప్రహృష్య మాణః

నిశిచరపతి సంక్షయం విదిత్వా సురగణ మధ్యగతో వచస్త్వరేతి ॥

## ఆదిత్యాష్టకం

ఆదిదేవ నమస్తుభ్యం ప్రసీద మమ భాస్కర
దివాకర నమస్తుభ్యం ప్రభాకర నమోస్తుతే
సప్తాశ్వ రధమారూఢం ప్రచండం కశ్యపాత్మజమ్
శ్వేత పద్మ ధరం దేవం తం సూర్యం ప్రణమామ్యహమ్
లోహితం రధమారూఢం సర్వలోక పితామహమ్
మహాపాపహరం దేవం తం సూర్యం ప్రణమామ్యహమ్
త్రైగుణ్యం చ మహాశూరం బ్రహ్మా, విష్ణు మహేశ్వరం
మహాపాపహరం దేవం తం సూర్యం ప్రణమామ్యహమ్
బృంహితం తేజః పుంజం చ వాయురాకాశ మేవ చ
ప్రభుం తం సర్వలోకానాం తం సూర్యం ప్రణమామ్యహమ్
బంధూక పుష్పసంకాశం హార కుండల భూషితమ్
ఏక చక్ర ధరం దేవం తం సూర్యం ప్రణమామ్యహమ్
తం సూర్యం లోక కర్తారం మహాతేజః ప్రదీపనమ్
మహాపాపశిహరం దేవం తం సూర్యం ప్రణమామ్యహమ్
తం సూర్యం జగతాం నాధం జ్ఞాన విజ్ఞాన మోక్షదం
మహాపాపహరం దేవం తం సూర్యం ప్రణమామ్యహమ్
సూర్యాష్టకం పఠేన్నిత్యం గ్రహపీడా ప్రణాశనమ్
అపుత్రో లభతే పుత్రం దరిద్రో ధనవాన్భవేత్
ఆమిషం మధుపానం చ యః కరోతి రవే ర్దినే
సప్త జన్మ భవేద్రోగి జన్మజన్మ దరిద్రతా
స్త్రీ తైల మధు మాంసాని యస్త్యజేత్తు రవే ర్దినే
న వ్యాధి శోక దారిద్ర్యం సూర్య లోకం స గచ్ఛతి

## శ్రీ ఆదిత్య స్తోత్రమ్

ఓం అస్య శ్రీ ఆదిత్య భగవత్ స్తోత్ర మహామంత్రస్య – అగస్త్య ఋషిః – అనుష్టుప్ ఛందః – శ్రీసూర్యనారాయణో దేవతా సూం బీజం –రీం–శక్తిః– మం–కీలకం–మమ ఆదిత్య ప్రసాద సిద్ధ్యర్థే జపే వినియోగః

ఓం ఆదిత్యాయ అంగుష్ఠాభ్యాం నమః ఆర్కాయ తర్జనీభ్యాం నమః దివాకరాయ మధ్యమాభ్యాం నమః ప్రభాకరాయ అనామికాభ్యాం నమః సహస్ర కిరణాయ– కనిష్ఠికాభ్యాం నమః మార్తాండాయ – కరతల కరపృష్ఠాభ్యాం నమః ఏవం హృదయాది న్యాసః

ధ్యానమ్:-
ధ్యాయే త్సూర్య మనంత శక్తి కిరణం తేజోమయం భాస్కరం
భక్తానా మభ యప్రదం దినకరం జ్యోతిర్మయం శంకరమ్
ఆదిత్యం జగదీశ మచ్యుత మజం త్రైలోక్య చూడామణిం
భక్తాభీష్ట వరప్రదం దినమణిం మార్తాండ మాద్యం శుభమ్ 1
బ్రహ్మావిష్ణు శ్చ రుద్ర శ్చ ఈశ్వర శ్చ సదాశివః
పంచబ్రహ్మ మయాకారా యేన జాతా స్త మీశ్వరమ్ 2
కాలాత్మా సర్వభూతాత్మా వేదాత్మా విశ్వతోముఖః
జన్మ మృత్య జరా వ్యాది సంసార భయ నాశనః 3
బ్రహ్మాస్వరూప ముదయే మధ్యాహ్నే తు మహేశ్వరః
అస్తకాలే స్వయం విష్ణుం స్త్రయీ మూర్తి ర్దివాకరః 4
ఏకచక్ర రథో యస్య దివ్యః కనక భూషితః
సోఽ యం భవతు నః ప్రీతః పద్మహస్తో దివాకరః 5
పద్మహస్తః పరంజ్యోతిః పరేశాయ నమో నమః
అండయోని ర్మహత్యాక్ష దాదిత్యాయ నమో నమః 6
కమలాసన దేవేశ ఆదిత్యాయ నమో నమః
ధర్మమూర్తి ర్దయామూర్తి స్తత్వమూర్తి ర్నమో నమః 7
సకలేశాయ సూర్యాయ క్షాంతేశాయ నమో నమః
క్షయాపస్మార గుల్మాది దుర్దోష వ్యాధి నాశనమ్ 8
సర్వ జ్వరహరం చైవ కుక్షిరోగ నివారణమ్
ఏతత్ స్తోత్రం శివప్రోక్తం సర్వసిద్ధికరం పరమ్ 9

శ్రీ సూర్య మండలాష్టకమ్

– భవిష్యోత్తరపురాణే శ్రీమదాదిత్యహృదయే

నమః సవిత్రే జగదేక చక్షుషే జగత్ప్రసూత స్థితి నాశ హేతవే
త్రయీమయాయ త్రిగుణాత్మధారిణేవిరించి నారాయణ శంకరాత్మనే
యన్మండలం దీప్తికరం విశాలం
రత్నప్రభం తీవ్ర మనాదిరూపమ్
దారిద్ర్య దుఃఖ క్షయకారణం చ
పునాతు మాం తత్సవితు ర్వరేణ్యమ్ 2
యన్మండలం దేవగణైః సుపూజితం

విప్రైః స్తుతం భావన ముక్తికోవిదమ్
తం దేవదేవం ప్రణమామి సూర్యం
పునాతు మాం తత్సవితు ర్వరేణ్యమ్ 3
యన్మండలం జ్ఞానఘనం త్వగమ్యం
త్రైలోక్య పూజ్యం త్రిగుణాత్మరూపమ్
సమస్త తేజోమయ దివ్యరూపం
పునాతు మాం తత్సవితు ర్వరేణ్యమ్ 4
యన్మండలం గూఢ మతిప్రబోధం
ధర్మస్య వృద్ధిం కురుతే జనానామ్
యత్సర్వపాప క్షయకారణం చ
పునాతు మాం తత్సవితు ర్వరేణ్యమ్ 5
యన్మండలం వ్యాధివినాశ దక్షం
యదృగ్యజు స్సామసు సంప్రగీతమ్
ప్రకాశితం యేన చ భూర్భువ స్స్వః
పునాతు మాం తత్సవితు ర్వరేణ్యమ్ 6
యన్మండలం వేదవిదో వదంతి
గాయంతి య చ్చారణ సిద్ధ సంఘాః
యద్యోగినో యోగజుషాం చ సంఘాః
పునాతు మాం తత్సవితు ర్వరేణ్యమ్ 7
యన్మండలం సర్వజనేషు పూజితం
జ్యోతి శ్చ కుర్యాదిహ మర్త్యలోకే
యత్కాల కల్ప క్షయం కారణం చ
పునాతు మాం తత్సవితు ర్వరేణ్యమ్ 8
యన్మండలం విశ్వసృజాం ప్రసిద్ధ
ముత్పత్తి రక్షా ప్రలయ ప్రగల్భమ్
యస్మిన్ జగ త్సంహరతే ऽ ఖిలం చ
పునాతు మాం తత్సవితు ర్వరేణ్యమ్ 9
యన్మండలం సర్వగతస్య విష్ణో
రాత్మా పరంధామ విశుద్ధత త్త్వమ్
సూక్ష్మాంతరై ర్యోగపథానుగమ్యం
పునాతు మాం తత్సవితు ర్వరేణ్యమ్ 10

యన్మండలం వేదవిదో వదంతి
గాయంతి య చ్చారణ సిద్ధ సంఘాః
యన్మండలం వేదవిదః స్మరంతి
పునాతు మాం తత్సవితు ర్వరేణ్యమ్ 11
యన్మండలం వేదవిదోపగీతం
యద్యోగినాం యోగపదాను గమ్యమ్
తత్సర్వవేదం ప్రణమామి సూర్యం
పునాతు మాం తత్సవితు ర్వరేణ్యమ్ 12
మండలాష్టతుయం పుణ్యం యః పఠు త్సతతం నరః
సర్వపాప విశుద్ధాత్మా సూర్యలోకే మహీయత్ 13

శ్రీ ఆదిత్య కవచమ్ – పద్మపురాణే

ఓం అస్య శ్రీ ఆదిత్య కవచ స్తోత్ర మహామంత్రస్య అగస్త్యో భగవాన్ ఋషిః అనుష్టుప్ ఛందః – ఆదిత్యోదేవతా – ఘృణింబీజం – ణీం శక్తిః – సూంకీలకం – మమ ఆదిత్య ప్రసాద సిద్ధ్యర్థే ఆదిత్య కవచ స్తోత్ర మంత్ర జపే – వినియోగః

ధ్యానమ్

జపాకుసుమ సంకాశం ద్విభుజం పద్మహస్తకమ్
సిందూరాంబర మాల్యం చ రక్తగంధానులేపనమ్ 1
మాణిక్య రత్న ఖచితం సర్వాభరణ భూషితమ్
సప్తాశ్వ రథవాహం తు మేరుం చైవ ప్రదక్షిణమ్ 2
దేవాసుర వరై ర్వంద్యం ఘృణిభిః పరిసేవితమ్
ధ్యాయే త్పఠే త్సువర్ణాభ్యాం సూర్యస్య కవచం ముదా 3
ఘృణిః పాతు శిరోదేశే సూర్యః పాతు లలాటకమ్
ఆదిత్యో లోచనే పాతు శ్రుతిం పాతు దివాకరః 4
ఘ్రాణం పాతు సదా భాను ర్ముఖం పాతు సదా రవిః
జిహ్వాం పాతు జగన్నేత్రః కంఠం పాతు విభావసుః 5
స్కందౌ గ్రహపతిః పాతు భుజౌ పాతు ప్రభాకరః
కరా వబ్జకరః పాతు హృదయం పాతు భానుమాన్ 6
మధ్యం పాతు సుసప్తాశ్వో నాభిం పాతు నభోమణిః
ద్వాదశాత్మా కటిం పాతు సవితా పాతు సక్థినీ 7
ఊరూ పాతు సురశ్రేష్ఠో జానునీ పాతు భాస్కరః
జంఘే మే పాతు మార్తండో గుల్ఫౌపాతు త్విషాంపతిః 8

పాదౌ దినమణిః పాతు పాతు మిత్రోఽ ఖిలం వపుః
ఆదిత్య కవచం పుణ్యమభేద్యం వజ్రసన్నిభమ్ 9
సర్వరోగ భయాదిభ్యో ముచ్యతే నాత్ర సంశయః
సంవత్సర ముపాసిత్వా సామ్రాజ్యపదవీం లభేత్ 10
అనేక రత్న సంయుక్తం స్వర్ణ మాణిక్య భూషణమ్
కల్పవృక్ష సమాకీర్ణం కదంబ కుసుమ ప్రియమ్ 11
అశేష రోగ శాంత్యర్థం ధ్యాయే దాదిత్య మండలమ్
తప్తకాంచన సంకాశం సహస్ర కిరణావృతమ్ 12
సిందూర వర్ణాయ సుమండలాయ
సువర్ణ రత్నాభరణాయ తుభ్యమ్
పద్మాభినేత్రాయ సంపంకజాయ
బ్రహేంద్ర నారాయణ శంకరాయ 13
సంరక్తచూర్ణం సమవర్ణ తోయం
సుకుంకుమాభం స కుశం సపుష్పమ్
ప్రదత్త మాదాయ చ హేమపాత్రే
ప్రశస్తనాదం భగవంత మీడే 14
శ్రీ సూర్యాష్టోత్తర శతనామ స్తోత్రమ్
అధర్వణ రహస్యే
అరుణాయ శరణ్యా కరునారస సింధవే
అసమాన బలా యార్త రక్షకాయ నమో నమః 1
ఆదిత్యయాఽ దిభూతాయ అఖిలాగమ వేదినో
అచ్యుతాయాఖిలజాయ అనంతాయ నమోనమః 2
ఇనాయ విశ్వరూపాయ ఇజ్యా యేంద్రాయ భానవే
ఇందిరామందిరాప్తాయ వందనీయాయ తే నమః 3
ఈశాయ సుప్రసన్నాయ సుశీలాయ సువర్చసే
వసుప్రదాయ వసవే వాసుదేవాయ తే నమః 4
ఉజ్జ్వలా యోగ్రరూపాయా ఊర్ధ్వగాయ వివస్వతే
ఉద్యత్కిరణజాలాయ హృషీకేశాయ తే నమః 5
ఊర్జస్వలాయ వీర్యాయ నిర్జరాయ జయాయ చ
ఊరు ద్వయాభావ రూపయుక్త సారధయే నమః 6

ఋషివంద్యాయ ఋక్సాస్త్రే ఋక్షచక్ర చరాయ చ
ఋజుస్వభావ చిత్తాయ నిత్యస్తుత్యాయ తే నమః 7
ఋూకారా మాతృకావర్ణ రూపా యోజ్జ్వల తేజసే
ఋక్షాధినాధ మిత్రాయ పుష్కరాక్షాయ తే నమః 8
లుప్త దంతాయ శాంతాయ కాంతిదాయ ఘనాయ చ
కనకత్కనక భూషాయ ఖద్యోతాయ నమో నమః 9
లూని తాఖిలదైత్యాయ సత్యానందస్వరూపిణే
అపవర్గప్రదా యా ర్తశరణ్యాయ నమో నమః 10
ఏకాకినే భగవతే సృష్టి స్థిత్యంతకారిణే
గుణాత్మనే ఘృణిభృతే భృహతే బ్రహ్మణే నమః 11
ఐశ్వర్యదాయ శర్వాయ హరిదశ్వాయ శౌరయే
దశది క్సంప్రకాశాయ భక్తవశ్యాయ తే నమః 12
ఓ జస్కరాయ జయినే జగదానంద హేతవే
జన్మమృత్యు జరావ్యాదివర్జితాయ నమో నమః 13
ఔన్నత్యపద సంచార రధస్థా యా త్మరూపిణే
కమనీయకరా యాబ్జవల్లభాయ నమో నమః 14
అంతర్బహిః ప్రకాశాయ అచింత్యాయాఽత్మరూపిణే
అచ్యుతాయా ఽమరేశాయ పరస్మై జ్యోతిషే నమః 15
అహస్కరాయ రవయే హరయే పరమాత్మనే
తరుణాయ వరేణ్యాయ గ్రహాణాం పతయే నమః 16
ఓం నమో భాస్కరాయాఽ దిమధ్యాంతరహితాయ చ

# శ్రీసూర్యార్యస్తోత్రమ్ శ్రీయాజ్ఞవల్క్య విరచితమ్

శుకతుండ చ్ఛవి సవితు శ్చండరుచేః పుండరీక వనబంధోః
మండల ముదితం వందే కుండల మాఖండ లాశాయాః 1
యస్యోదయా స్తనమయే సురముకుట నిఘృష్ట చరణ కమలోఽపి
కురుతేంజలిం త్రినేత్రః స జయతి ధామ్నాం నిధిః సూర్యః 2
ఉదయాచల తిలకాయ ప్రణతో స్మి వివస్వతే గ్రహేశాయ
అంబరచూడామణయే దిగ్వనితా కర్ణపూరాయా 3
జయతి జనానందకరః కరనికర నిరస్త తిమిర సంఘాతః

లోకాలోకాలోకః కమలారుణ మండలః సూర్యః 4
ప్రతిబోధిత కమలవనః కృత ఘటన శ్చక్రవాక మిధునానామ్
దర్శిత సమస్త భువనః పరహిత నిరతో రవిః సదా జయతి 5
అపనయతు సకల కవికృత మల పటలం సుప్రత ప్త కనాకాభః
అరవింద బృంద విఘటన పటుతర కిరణోత్కరః సవితా 6
ఉదయాద్రి చారు చామర హరిత హయ ఖుర పరిహత రేణురా
హరిత హయ హరిత పరికర గగనాంగన దీపక నమస్తే 7
ఉదితవతి త్వయి వికసది ముకులీయతి సమస్త మ స్తమిత బిందే
నహ్యన్యస్మిన్ దినకర సకలం కమలాయతే భువనమ్ 8
జయతి రవి రుదయ సమయే బాలాతపః కనక సన్నిభో యస్య
కుసుమాంజలి రివ జలధౌ తరంతి రధ సప్తయః సప్త 9
ఆర్యాఃసాంబపురే సప్త ఆకాశ త్పతితా భువి
యస్య కంఠే గృహే వాపి న స లక్ష్మ్యా విముజ్యతే 10
ఆర్యాసప్త పదా య స్తు సప్తమ్యాం సప్తధా జపేత్
తస్య గేహం చ దేహం చ పద్మా సత్వం స ముంచతి 11
నిధిరేష దరిద్రాణాం రోగిణాం పరమౌషధమ్
సిద్ధిః సకలకార్యాణాం గాధేయం సంస్మృతా రవేః

## బ్రహ్మ పురాణోక్త సూర్యాష్టోత్తర శతనామస్తోత్రమ్

సూరో ఽర్యమా భగ స్త్వష్టా పూషాఽ ర్కః సవితా రవిః ।
గభస్తిమా నజః కాలో మృత్యు ర్ధాతా ప్రభాకరః ॥ 1.
పృధి వ్యాపశ్చ తేజశ్చ ఖం వాయశ్చ పరాయణం ।
సోమో బృహస్పతిః శుక్రో బుధోఽ ంగారక ఏవచ॥ 2
ఇంద్రో వివస్వాన్ దీప్తాంశుః శుచిః శౌరీః శనైశ్చరః ।
బ్రహ్మా విష్ణుశ్చ రుద్రశ్చ స్కందో వైశ్రవణో యమః ॥ 3
వైద్యుతో జార రశ్చాగ్ని రైంధన స్తేజసాం పతిః ।
ధర్మధ్వజో వేదకర్తా వేదింగో వేదవాహనః 4
కృతం త్రేతా ద్వాపరశ్చ కలిః సర్వామరాశ్రయః
కలా కాష్టా ముహూర్తాశ్చ క్షపాయామాస్తథా క్షణా ॥ 5
సంవత్సర కరోఽ శ్వత్థః కాలచక్రో విభావసుః
పురుషః శాశ్వతో యోగీ వ్యక్తా వ్యక్తః సనాతనః ॥ 6
కాలాధ్యక్షః ప్రజాధ్యక్షో విశ్వకర్మా తమోనుదః

వరుణః సాగరోఽంశశ్చ జీమూతో జీవనోఽరిహా ॥ 7
భూతాశ్రయో భూతపతిః సర్వలోక సమస్కృతః ।
స్రష్టా సంవర్తకో వహ్నిః సర్వస్యాఽఽదిర లోలుపః ॥ 8
అనంతః కపిలో భానుః కామదః సర్వతోముఖః ।
జయో విశాలో వరదః సర్వభూత నిషేవితః ॥ 9
మనః సువర్ణో భూతాదిః శృఘ్రగః ప్రాణధారణః ।
ధన్వంతరి ర్ధూమకేతు రాదిదేవో ఽదితే సుతః ॥ 10
ద్వాదశాత్మా రవిర్దక్షః పితామాతా పితామహః ।
స్వర్గ ద్వారం ప్రజాద్వారం మోక్షద్వారం త్రివిష్టపమ్ ॥ 11
దేహకర్తా ప్రశ్శాంతాత్మా విశ్వాత్మా విశ్వతోముఖః ।
చరాచరాత్మా సూక్ష్మాత్మా మైత్రేయః కరుణాన్వితః ॥ 12
ఏతద్వై కీర్తనీ యస్య సూర్యస్యామిత తేజసః ।
నామ్నా మష్టశతంరమ్యం మయాప్రోక్తం ద్విజోత్తమా ॥ 13
సురగణ పితృ యక్ష సేవితం। హ్యాసుర నిశాకర సిద్ధ వందితం।
వరకనక హుతాశన ప్రభం। ప్రణిపతితో ఽస్మి హితాయ భాస్కరమ్ ॥ 14

## శ్రీ సూర్యాష్టకమ్ (శ్రీ శివప్రోక్తము)

అదిదేవ నమస్తుభ్యం ప్రసీద మమ భాస్కర ।
దివాకర నమస్తుభ్యం ప్రభాకర నమోఽస్తుతే ॥ 1
సప్తాశ్వరథ మారూఢం ప్రచండం కశ్యపాత్మజమ్ ।
శ్వేతపద్మధరం దేవం తం సూర్యం ప్రణమామ్యహమ్ ॥ 2
లోహితం రథ మారూఢం సర్వలోక పితామహమ్ ।
మహాపాపహరం దేవం తం సూర్యం ప్రణమామ్యహమ్ ॥ 3
త్రైగుణ్యం చ మహాశూరం బ్రహ్మవిష్ణుమహేశ్వరమ్ ।
మహాపాపహరం దేవం తం సూర్యం ప్రణమామ్యహమ్ ॥ 4
బృంహితం తేజసాం పుంజం వాయు రాకాశమేవ చ ।
ప్రభుస్త్వం సర్వలోకానాం తం సూర్యం ప్రణమామ్యహమ్ ॥ 5
బంధూక పుష్ప సంకాశం హారకుండల భూషితమ్ ।
ఏకచక్రధరం దేవం తం సూర్యం ప్రణమామ్యహమ్ ॥ 6
విశ్వేశం విశ్వకర్తారం మహాతేజః ప్రదీపనమ్ ।
మహాపాపహరం దేవం తం సూర్యం ప్రణమామ్యహమ్ ॥ 7
తం సూర్యం జగతాం నాథం జ్ఞానప్రకాశమోక్షదమ్ ।

మహాపాపహరం దేవం తం సూర్యం ప్రణమామ్యహమ్ ॥ 8
సూర్యాష్టకం పఠేన్నిత్యం గ్రహపీడా ప్రణాశనమ్ ।
అపుత్రో లభతే పుత్రం దరిద్రో ధనవాన్ భవేత్ ॥ 9
ఆమిషం మధుపానం చ యః కరోతి రవేర్దినే ।
సప్తజన్మ భవే ద్రోగి జన్మజన్మదరిద్రతా ॥ 10
స్త్రీ తైలమధుమాంసాని యే త్యజంతి రవే ర్దినే ।
న వ్యాధిశోక దారిద్ర్యం సూర్యలోకం చ గచ్ఛతి ॥ 11

## 5 సూర్య కవచం

ఓం అస్య శ్రీసూర్య కవచ స్తోత్ర మహామంత్రస్య। అగస్త్యో భగవాన్ ఋషిః అనుష్టుప్ఛందః । సూర్యో దేవతా । శ్రీం బీజమ్। ణీం శక్తిః । సూం కీలకం। మమ సూర్య ప్రసాద సిద్ధ్యర్థే జపే వినియోగః

ధ్యానం – జపా కుసుమ సంకాశం ద్విభుజం పంచహస్తకం
సిందూరాంబర మాల్యం చ రక్త గంధాను లేపనం
మాణిక్య రత్న ఖచిత సర్వాభరణ భూషితం
సప్తాశ్వరథ వాహం తు మేరుం చైవ ప్రదక్షిణమ్
దేవాసురవరై ర్వంద్యం ఘృణిభిః పరిసేవితం
ధ్యాయే త్పఠేత్సువర్ణాభం సూర్యస్య కవచం ముదా
ఘృణిఃపాతు శిరో దేశే సూర్యః పాతు లలాటకం
ఆదిత్యో లోచనే పాతు శ్రుతిం పాతు దివాకరః
ఘ్రాణం పాతు సదా భానుః ముఖం పాతు సదా రవిః
జిహ్వాంపాతు జగన్నేత్రః కంఠం పాతు విభావసుః
స్కంధౌ గ్రహపతిః పాతు భుజౌ పాతు ప్రభాకరః
కరావబ్జకరః పాతు హృదయం పాతు భానుమాన్
మధ్యం పాతు సుసప్తాశ్వో నాభిం పాతు నభోమణిః
ద్వాదశాత్మా కటిం పాతు సవితా పాతు సక్థినీ
ఊరూ పాతు సుర శ్రేష్ఠో జానునీ పాతు భాస్కరః
జంఘే మే పాతు మార్తాండో గుల్ఫౌ పాతు త్విషాం పతిః
పాదౌ దినమణిః పాతు పాతు మిత్రోఽఖిలం వపుః
ఫలశ్రుతి :–శ్రీ సూర్య కవచం పుణ్య మభేద్యం వజ్ర సన్నిభమ్
సర్వ రోగ భయాదిభ్యో ముచ్యతే నాత్ర సంశయః
సంవత్సర ముపాసిత్వా సామ్రాజ్య పదవీం లభేత్

అనేక రత్న సంయుక్తం స్వర్ణ మాణిక్య భూషణం
కల్పవృక్ష సమాకీర్ణం కదంబ కుసుమ ప్రియం
తప్త కాంచన సంకాశం సహస్ర కిరణావృతం
అశేష రోగ శాంత్యర్థం ధ్యాయే దాదిత్య మండలం
సిన్దూర వర్ణాయ సుమండలాయ సువర్ణ రత్నాభరణాయ తుభ్యం
పద్మాభి నేత్రాయ సుపంకజాయ బ్రహ్మేంద్ర నారాయణ శంకరాయ
సంరక్త చూర్ణం ససువర్ణ తోయం సుకుంకుమాభం సకుశం సపుష్పం
ప్రదత్తమాదాయ చ హేమ పాత్రే ప్రశస్త నాదం భగవాన్ ప్రసీద.

## శ్రీ యాజ్ఞవల్క్యకృత - సూర్యకవచస్తోత్రమ్

శ్రీ యాజ్ఞవల్క్య ఉవాచ
శృణుష్వ మునిశార్దూల సూర్యస్య కవచం శుభమ్
శరీరారోగ్యదం దివ్యం సర్వసౌభాగ్య దాయకమ్ 1
దేదీప్యమాన ముకుటం స్ఫురన్మకరకుండలమ్
ధ్యాత్వా సహస్రకిరణం స్తోత్ర మేత దుదీరయేత్ 2
శిరో మే భాస్కరః పాతు లలాటం మేఽ మితద్యుతిః
నేత్రే దినమణిః పాతు శ్రవణే వాసరేశ్వరః 3
ఘ్రాణం ఘర్మఘృణిః పాతు వదనం వేదవాహన
జిహ్వాం మే మానదః పాతు కంఠం మే సురవందితః 4
స్కంధౌ ప్రభాకరః పాతు వక్షః పాతు జనప్రియః
పాతు పాదౌ ద్వాదశాత్మా సర్వాంగం సకలేశ్వరః 5
సూర్యరక్షాత్మకం స్తోత్రం లిఖిత్వా భూర్జపత్రకే
దధాతి యః కరే తస్య వశ్యగాః సర్వసిద్ధయః 6
సుస్నాత యో జపే త్సమ్యగ్యోఽ ధీతే స్వస్థమానసః
స రోగముక్తో దీర్ఘాయుః సుఖం పుష్టిం చ విందతి 7

## 7 సూర్యస్తోత్రం

ధ్యాయే త్సూర్య మనంతకోటికిరణం పద్మహాసః పంజ్యోతిః
తేజోమయం భాస్కరం పరేశాయ నమో నమః
భక్తానా మభయ ప్రదం దినకరం అండయోని ర్మహాసాక్షీ
జ్యోతిర్మయం శంకరమ్ ఆదిత్యాయ నమో నమః
ఆదిత్యం జగదేశమచ్యుత మజం కమలాసన దేవేశ
త్రైలోక్య చూడామణిం ఆదిత్యాయ నమో నమః

భక్తాభీష్ట వరప్రదం దినమణిం ధర్మమూర్తి ర్దయా మూర్తిః
మార్తాండ మాద్యం శుభమ్ సత్య మూర్తిర్నమో నమః
కాలాత్మా సర్వ భూతాత్మా సకలేశాయ సూర్యాయ
వేదాత్మా విశ్వతోముఖః క్షాంతీశాయ నమో నమః
జన్మ మృత్యుజరావ్యాధి క్షయాపస్మార గుల్మాది
సంసార భయ నాశనః దుర్దోష వ్యాధి నాశనం
బ్రహ్మా స్వరూప ముదయే సర్వజ్వర హరం చైవ
మధ్యాహ్నేతు మహేశ్వరః కుక్షి రోగ నివారణంః
అస్తమానే స్వయం విష్ణుః ఏతత్ స్తోత్రం శివప్రోక్తం
త్రయీమూర్తి ర్దివాకరః సర్వసిద్ధి కరం పరం
ఏక చక్ర రథో యస్య సర్వ సంపత్కరం చైవ
దివ్యః కనక భూషితః సర్వాభీష్ట ప్రదాయికం
సోఽయం భవతు నః ప్రీతః
పద్మ హస్తో దివాకరః
ఇతి శ్రీసూర్యనారాయణ స్తోత్రం సంపూర్ణం

**4. శ్రీసూర్యద్వాదశనామ స్తోత్రం**

ఓం ఏకచక్ర రథోయస్య దివ్యః కనక భూషితః
స మే భవతు సుప్రీతః పద్మహస్తో దివాకరః
ఓం ఆదిత్యః ప్రథమం నామ
ద్వితీయం చ దివాకరః
తృతీయం భాస్కరః ప్రోక్తం
చతుర్థం తు ప్రభాకరః ॥
పంచమంచ సహస్రాంశు
షష్ఠం త్రైలోక్యలోచనః
సప్తమం హరిదశ్వశ్చ
అష్టమం తు రవిస్తథా ॥
నవమం దినకృత్ప్రోక్తం ।
దశమం ద్వాదశాత్మకః ।
ఏకాదశం త్రయీమూర్తి
ర్ద్వాదశం సూర్యఏవచ ॥
ఫలశ్రుతి:-

ద్వాదశాదిత్యనామాని ప్రాతః కాలేపరేన్నరః
దుస్వప్న నాశనం చైవ సర్వ దుఃఖం చ నశ్యతి
దద్రు కుష్ఠ హరం చైవ దారిద్ర్యం హరతి ధృవం
సర్వ తీర్థ మయం పుణ్యం సర్వ కామ ఫల ప్రదం॥
ఓం తత్సత్
"శ్రీసూర్య ద్వాదశ నామ స్తోత్రం సమాప్తం"
శ్రీసూర్య దేవతార్పితమస్తు

## 8.సూర్యాష్టోత్తర శతనామ స్తోత్రం

అరుణాయ శరణ్యా కరుణారస సింధవే
అసమాన బలాయ ఆర్త రక్షకాయ నమో నమః
ఆదిత్యాయ ఆదిభూతాయ అఖిలాగమ వేదినే
అచ్యుతాయ అఖిలజ్ఞాయ అనంతాయ నమో నమః
ఇనాయ విశ్వరూపాయ ఇజ్యాయేంద్రాయ భానవే
ఇందిరామందిరాప్తాయ వందనీయాయ తే నమః
ఈశాయ సుప్రసన్నాయ సుశీలాయ సువర్చసే
వసుప్రదాయ వసవే వాసుదేవాయ తే నమః
ఉజ్జ్వలాయోగ్రరూపాయ ఊర్ధ్వగాయ వివస్వతే
ఉద్యత్కిరణజాలాయ హృషీకేశాయ తే నమః
ఊర్జస్వలాయ వీర్యాయ నిర్జరాయ జయాయ చ
ఊరుద్వయాభావరూపయుక్త సారథయే నమః
ఋషివంద్యాయ రుగ్ఘన్త్రే ఋక్షచక్రచరాయ చ
ఋజుస్వభావ చిత్తాయ నిత్యస్తుత్యాయతే నమః
ౠకార మాతృకా వర్ణరూపాయోజ్జ్వల తేజసే
ౠక్షాది నాథ మిత్రాయ పుష్కరాక్షాయ తే నమః
ఌప్తదంతాయ శాంతాయ కాంతిదాయ ఘనాయ చ
కనత్కనక భూషాయ ఖద్యోతాయ నమో నమః
ౡనితాఖిల దైత్యాయ సత్యానంద స్వరూపిణే
అపవర్గ ప్రదాయార్త శరణ్యాయ నమో నమః
ఏకాకినే భగవతే సృష్టిస్థిత్యంత కారిణే
గుణాత్మనే ఘృణిభృతే బృహతే బ్రహ్మణే నమః
ఐశ్వర్యదాయ శర్వాయ హర్యశ్వాయ శౌరయే

దశదిక్సంప్రకాశాయ భక్తవశ్యాయ తే నమః
ఓజస్కరాయ జయినే జగదానాంద హేతవే
జన్మమృత్యుజరావ్యాధి వర్జితాయ నమోనమః
ఔచ్చస్థాన సమారూఢ రథస్థాయాసురారయే
కమనీయ కరాయాబ్జ వల్లభాయ నమోనమః
అంతర్బహిః ప్రకాశాయ అచింత్యాయాత్మ రూపిణే
అచ్యుతాయా ఽ మరేశాయ పరస్మైజ్యోతిషే నమః
అహస్కరాయ రవయే హరయే పరమాత్మనే
తరుణాయ వరేణ్యాయ గ్రహాణం పతయే నమః
ఓం నమో భాస్కరాయాదిమధ్యాంత రహితాయ చ
సౌఖ్యప్రదాయ సకల జగతాం పతయేనమః
నమస్సూర్యాయ కవచయే నమో నారాయణాయ చ
నమో నమః పరేశాయ తేజోరూపాయ తే నమః
ఓం శ్రీం హిరణ్యగర్భాయ ఓం హ్రీం సంవత్సరాయ చ
ఓం ఐం ఇష్టార్థదాయ సుప్రసన్నాయతే నమః
శ్రీమతే శ్రేమసే భక్తకోటి సౌఖ్యప్రదాయినే
నిఖిలాగమ వేద్యాయ నిత్యానంధాయ తే నమః

యో మానవ స్సంతత మర్కమర్చ య। స్పరేత్ప్రభాతే విమలేన చేతసా ఇమాని నామాని చ తస్య పుణ్య మాయుర్ధనం ధాన్యముపైతి నిత్యమ్ ఇమం స్తపం దేవవరస్య కీర్తయే, చ్ఛృణోతి యోఽయం సుమానాత్సమహితః స ముచ్యతే శోకదవాగ్ని సాగరాల్లభే త్సర్వాన్మనసో యధేప్సితాని ॥

(ఇది శ్రీమందధర్వణరహస్యే సూర్యాష్టోత్తర శతనామ స్తోత్రం సంపూర్ణం)

శ్రీసూర్య సహస్ర నామ స్తోత్రమ్

ఆదౌ సంకల్ప్య, మమశరీరోత్పన్నోత్పత్స్య మానానాం వాత పిత్త కఫ సన్నిపాత జ్వరాగ్నిమాంద్య విరశ్శూల క్షీణధాత్వాది రోగాణాం సమూల నిరసన ద్వారా క్షిప్రారోగ్య శరీరపుష్టి దీర్ఘయుష్యైశ్వర్యాభివృద్ధి శతృపరాజయాది నిఖిల కామవాది సిద్ధ్యర్థం శ్రీ సూర్యనారాయణ ప్రీతయే శ్రీ సూర్యదివ్య సహస్రనామ పఠనం కరిష్యే

ఆస్య శ్రీ సూర్యసహస్రనామ స్తోత్ర మహామంత్రస్య ప్రకణ్వాఋషిః అనుష్టుప్ఛందః, శ్రీ సూర్యనారాయణోదేవతా , వేదాః బీజమ్, మాయా శక్తిః సంకల్పితాభీష్ట సిద్ధ్యర్థే సహస్రనామ జపే వినియోగః

హరిః ఓం

విశ్వజి ద్విశ్వకర్తాచ విశ్వాత్మా విశ్వతోముఖః ।
విశ్వేశ్వరో విశ్వయోని ర్నియతాత్మా జితేంద్రియః ॥ 1
కాలాశ్రయః కాలకర్తా కాలహా కాలనాశనః ।
మహాయోగీ మహాబుద్ధి ర్మహాత్మా సుమహాబలః ॥ 2
ప్రభు ర్విభు ర్భూతనాధో భూతాత్మా భువనేశ్వరః ।
భూతభవ్యో భావితాత్మా భూతాంతఃకరణ శ్శివః ॥ 3
శరణ్యః కమలానందో నందనో నందవర్ధనః ।
వరేణ్యో వరదోయోగీ సుసంయుక్తః ప్రకాశనః ॥ 4
ప్రాక్ర్పాణశ్చే పరప్రాణః ప్రీతాత్మ ప్రయతః ప్రియః ।
నయ స్సహస్రపదత్సాధుః దివ్యకుండల మండితః ॥ 5
అవ్యంగధారీ ధారాత్మా ప్రచేతా వాయువాహనః ।
సమాహితమమతి ర్ధాతా విధాతా కృతమంగళః ॥
కపర్దీకల్ప కృద్రుద్రు స్సుమనా ధర్మవత్సలః ।
సమాయుక్తో నియుక్తాత్మా శమాత్మా కృతినాంవరః ॥ 7
శ్రేష్ఠోఽ చింత్యవపుశ్చైవ మహాయోగో మహేశ్వరః ।
కాంతః కామాది రాదిత్యో నియతాత్మా నిరాకులః ॥ 8
కామః కారుణికః కర్తా బోధకః కమలాకరః ।
సప్తసప్తిరచింత్యాత్మా మహాకారుణికోత్తమః ॥ 9
సంజీవనో జీవనాధో జగజ్జీవో జగత్పతిః ।
విశ్వానిలో జయ స్సంవిభాగశ్చ వృషభధ్వజః ॥ 10
వృషాకపిః కల్పకర్తా కల్పాంతఃకరణో రవిః ।
ఏకచక్రరధో మానీ సురధోరధినాంవరః ॥ .11
అక్రోధనో రశ్మిమాలీ తేజోరాశి ర్విభావసుః ।
దివ్యకృ ద్దినకృ ద్దేవో దేవదేవో దివస్పతిః ॥ 12
దిననాధో హవిర్హోతా దివ్యబాహు ర్దివాకరః ।
యజ్ఞో యజ్ఞపతిః పూష్ణా స్వర్ణ రేతాః పరావహః ॥ 13
పరాపరజ్ఞః తరణి రంశుమాలి మనోహరః ।
ప్రాజ్ఞః ప్రజ్ఞాపతి స్సూర్య స్సవితా విష్ణురంశుమాన్ ॥ 14
మహాగతి ర్గంధబాహు ర్విహితో విధి రాశుగః ।
పతంగః పగత స్సాణు ర్విహంగో విహగో వరః ॥ 15
హర్యశ్వో హరితాశ్వశ్చ హరిధశ్వో జగత్ప్రియః ।
త్ర్యంబక స్సర్వదమనోభావితాత్మా భిషగ్వరః ॥ 16

అలోకక్రృ ల్లోకనాధో లోకాలోక నమస్కృత ।
కాలః కల్పాంతకో వహ్ని స్తపనో విశ్వతాపనః ॥ 17
ఖడ్గీ ప్రతర్ధనో ధన్యో హయగో వాగ్విశారదః ।
శ్రీమాం చ్ఛ్రీశశిరా వాగ్మీ శ్రీపతి శ్రీనికేతనః ॥ 18
శ్రీకంఠ శ్రీధర శ్రీశ శ్రీనివాసో వసుప్రదః ।
కామచారీ మహాకాయో మహేశో విదితాశయః ॥ 19
తీర్థక్రియా వాన్సునయో విభవో భక్తవత్సలః ।
కీర్తిః కీర్తి కరో నిత్యఃకుండలీ కవచీ రథీ ॥ 20
హిరణ్యరేతా స్సత్యశ్చ ప్రయతాత్మా పరంతపః ।
బుద్ధిమా సమర శ్రేష్ఠో రోచిష్ణుః పాపనాశనః ॥ 21
సముద్రో ధనదో ధాతా మాం ధాతా కశ్మలాపహః ॥
తమోహా ధ్వాంతహా జ్యోతిస్త్రాతాంతః కరణోగుహః ॥ 22
పశుమా న్ప్రయతానందో భేతేశ శ్రీమతాంవరః ।
నిత్యాదిత్యో నిత్యరధ స్సురేశ స్సుర పూజితః ॥ 23
అజితో విజయో జేతా జంగమస్థావరాత్మకః ।
జీవానందో నిత్యకామీ విజేతా విజయప్రదః ॥ 24
పర్జన్యోఽగ్నిస్థితి స్థేయాన్ స్తవిరోఽణు ర్నిరంజనః ।
ప్రద్యోతనో రధారూఢ స్సర్వలోక ప్రకాశకః ॥ 25
ధ్రువోమేదీ మహావీర్యో హంస స్సంసారతారకః ।
సృష్టికర్తా క్రియా హేతు ర్మార్తాండో మరుతాంపతిః ॥ 26
మరుత్వా స్దహన స్త్వష్టా భగోభోగోర్యమాపతిః ।
వరుణేశో జగత్స్వామీ కృతకృత్య స్సులోచనః ॥ 27
వివస్వా న్భానుమాన్కార్యకారణో వర్చసాంనిధి ।
అసంగగామీ తిగ్మాం శు ర్ధర్మాంశు ర్దీప్తదీధితిః ॥ 28
సహస్రదీధితింర్బ్రధ్న స్సహస్రాంశుః ప్రభాకరః ।
గభస్తిమా న్దిధితామాన్ ఋగ్విధాతా తులద్యుతిః ॥ 29
భాస్కర స్సురకార్యజ్ఞ స్సర్వజ్ఞ స్తీక్ష్ణ దీధితిః ।
సుర జ్యేష్ఠ స్సురపతి ర్బృహుజ్ఞో వచసాంపతిః ॥ 30
తేజోనిధి ర్బృహత్తేజా బృహత్కీర్తి ర్బృహస్పతిః
అహిమోఽనూర్జితో దీమా నాముక్తః కీర్తివర్ధనః ॥ 31
మహావైద్యో గణపతి ర్గణేశో గణనాయకః ।
తీవ్రః ప్రతాపన స్తాపీతాపనో విశ్వతాపన ॥ 32

కార్తస్వరో హృషికేశః పద్మీ నందో భినందితః ॥
పద్మనాభో మృతాహార స్థితిమాన్ కేతుమాన్నభః । 33
అనాద్యంతోఽ చ్యుతో విశ్వో విశ్వామిత్రో ఘృణీవిరాట్ ॥
ఆముక్తో ముక్తిజనకః కంచుకీ విశ్వభావనః । 34
అనిమిత్తగతి శ్శ్రేష్ఠ శ్శరణ్యా స్సర్వతోముఖః ॥
విగాహీరేణు రసహా స్సమాయుక్త స్సమాహితః ॥ 35
దర్మకేతు ర్ధర్మరతి స్సంహర్తా సంయమో యమః ॥
ప్రణవార్తిహరో వాదీ ఋతుః కాలానలద్యుతిః ॥ 36
సుకసేవ్యో మహాతేజాః జగతా మాదికారణం ।
మహేంద్రోఽ భీష్ట ద స్తోత్ర స్తుతిహేతు ర్విభాకరః ॥ 37
సహస్రకర ఆయుష్మా నరోరష స్సుఖద స్సుఖీ ।
వ్యాధిహా దుఃఖహా సౌఖ్యః కళ్యాణః కల్పినాంవరః ॥ 38
అరోగకారణో బుద్ధిస్సిద్ధి ర్వృద్ది రహస్పతిః ।
హిరణ్యరేతా ఆరోగ్యో విన్వాన్వృందు ర్బుధోమహాన్ ॥ 39
ధీమాంశ్చ ప్రాణవా స్ధర్మో ధర్మకర్తా రుచిప్రదః ।
సర్వప్రియ స్సర్వసహా స్సర్వశత్రు నివారణః ॥ 40
ప్రాంశు ర్విద్యోతనోద్యోత స్సహస్రకిరణః కృతీ ।
కేయూరభూషణోద్భాసీ భాసితో భాసనోఽనలః ॥ 41
శరణ్యార్తిహరో దాతా ఖద్యోతః ఖగసత్తమః ।
కర్మసాక్షీ తమోఽరాతి స్సర్వద్యుతిహరో ఽమలః॥ 42
కళ్యాణీ కళ్యాణకరః కల్పః కల్పకరః కవిః ।
కళాణ్యస్సృ క్కల్పవపు స్సర్వ కళ్యాణభాజనః ॥ 43
శాంతిప్రియః ప్రసన్నాత్మా ప్రశాంతః ప్రశమక్రియః ।
ఉదారకర్మాసునయ స్సువర్చా వర్చసోజ్జ్వలః ॥ 44
వర్చస్వీ వర్చసామీశః స్త్రైలోక్యేశో వశ్యానుగః ।
ఓజస్వీ సయశా వర్ణీ వర్ణాధ్యక్షో బలిప్రియః ॥ 45
యశస్వి వేదనిలయ స్తేజస్వి ప్రకృతిస్థితః ।
ఆకాశగ శ్శీఘ్రగతి రాశుగ శ్శ్రుతతిమాన్ఖగః ॥ 46
గోపతి ర్గ్రహదేవేశో గోమానేకః ప్రభంజనః ।
జేత్రాచ ప్రజనో దీపో జీవ స్సర్వప్రకాశకృత్ ॥ 47
కర్మసాక్షీ యోగనిత్యో నభస్వా నసురాంతకః ।

రక్షోఘ్నో విఘ్నశమనః కిరీటి సుమనః ప్రియః ॥ 48
మరీచిమా ననుమతో గతక్షోభో విశేషగః ।
శిష్టాచార స్సదాచార స్స్వాచార శ్చారతత్పరః ॥ 49
మందరో మరరోరేణుః క్షోభణః పక్షిణాం గురుః ।
కృతక్షోభ్యో విశిస్టాత్మా విధేయో జ్ఞానశోభనః ॥ 50
శ్వేకాంతో మహాశ్వేత స్స్వామగో మోక్షదాయకః ।
సర్వ వేదగతాత్మాచ సర్వవేదా లయాలయః ॥ 51
వేదమూర్తి శ్చతుర్వేదో వేదాబ్ధి ర్వేదపారగః ।
క్రియావా నతిరోచిష్ణు ర్వరీయాంశ్చ వరప్రదః ॥ 52
వ్రతధారీ వ్రతధరో లోకబంధు రలంకృతః ।
అలంకారోఽ క్షరో దివ్యవిద్యావా న్విదితాశయః ॥ 53
ప్రభాపూర్ణో జితరిపు స్సుజనోఽ రుణసారధిః ।
కుబేర స్సురథ స్కంధో మహితోఽ భిహితోగురుః ॥ 54
గ్రహరాజో గ్రహపతి ర్గ్రహనక్షరతమండనః ।
భాస్కర స్సతతానందో నందనో వరవాహనః ॥ 55
చతుర్ముఖః పద్మమాలీ పూతాత్మా ప్రణతార్తిహా ।
అకించన స్సత్యసంధో నిర్గుణో గుణవాన్గుణీ ॥ 56
సంపూర్ణ పుండరీకాక్షీ విధేయో యోగతత్పరః ।
సహస్రాంశుః క్రతుపతి స్సర్వస్వ స్సుమతి స్సువాక్ ॥ 57
సువాహనో మాల్యదామా ఘృతాహారో హరిప్రియః ।
ప్రథితో బ్రాహ్మణో బ్రహ్మో ప్రతీతాత్మా సురాలయః ॥ 58
శతబిందు శ్శతమఖో గరియా ననలఃప్రదః ।
ధీరో మహత్తరో ధన్యపురుషః పురుషోత్తమః ॥ 59
సుసంస్థితో దివ్యరథో మోక్షాధారనికేతనః ।
వైద్యో రాజాధిరాజశ్చ విద్యారాజో వివాదకృత్ ॥ 60
అనిర్దేశ్యవపు శ్శ్రీదో వీరేంద్రో బహుమంగళః ।
నిర్ద్వంద్వో ద్వంద్వహా పర్గ స్సర్వ స్సర్వప్రకాశకః ॥ 61
చతుర్వేదధరో నిత్యో వినిద్రో వినిధాశనః ।
చక్రవర్తీ ధృతికరో మహారాజో మహేశ్వరః ॥ 62
విచిత్రరథ ఏకాకీ సప్తసప్తిః పరాత్పరః ।
సర్వోదధిస్థితికర స్థితి స్థేయ స్థితి ప్రియః ॥ 63
నిష్కలః పుష్కలనభా వసుదో వాసవప్రియః ।

